సి:

౨౧. దేవపూజ:-విద్వాంసులు, మాత, పిత, ఆచార్యుడు, అతిథి చేయుచుకారియగురాజు, ధర్మాత్ములగు జనులు, పతివ్రతాస్త్రీ, స్త్రీవ్రతుఁడైన పతి వీని సత్కరించుటయే "దేవపూజ" దీనికి విపరీతమైనది అదేవపూజ యనఁ మ్మను. మొదటివారి మూర్తులు పూజ్యములనియు, నితరపాషాణాది జడ వస్తువులు నితాంత మపూజ్యము లనియు నమ్ముచున్నాఁడను.

౨౨. శిక్ష:- "శిక్ష" విద్య, సభ్యత, ధర్మాత్మత, జితేంద్రియత మొదలగునవి వృద్ధిఁబొందించుచు నవిద్యాది దోషములను నశింపఁజేయు నదియే శిక్ష.

౨౩. పురాణములు:- బ్రహ్మాదులచే రచింపఁబడిన ఐతరేయాది బ్రాహ్మణ గ్రంథములనే పురాణ. ఇతిహాస, కల్ప, గాథా, నారాశంసీయము లని యంగీకరించుచున్నాఁడను. ఇతర భాగవతాదులనుగాదు.

౨౪. తీర్థములు:-సత్యభాషణము, విద్య, సత్సంగత్వము, యమాదులు, యోగాభ్యాసము, పురుషార్థము, విద్యాదానాది శుభకర్మములు అను నవియే దు:ఖసాగరమునుండి తరింపఁజేయును. కాన వీనినే తీర్థములని నమ్ముచున్నాఁడను. ఇతర జలస్థలాదులనుగాదు.

౨౫. పురుషార్థము:- "పురుషార్థము ప్రారబ్ధమునకంటె గొప్ప" యేలనగా దానివలననే సంచిత ప్రారబ్ధము లేనఁగూడును. అది సవరింపఁబడిన నన్నియు సవరింపఁబడును. అదిచెడిన నన్నియుఁజెడును. కానఁ ప్రారబ్ధమునకంటెఁ బురుషార్థమే గొప్ప.

౨౬. ప్రవర్తన:- మనుష్యుడు అందఱితో యథాయోగ్యముగ, తన వలెఁ జూచుచు సుఖ, దు:ఖ, హాని, లాభములందు వర్తించుట శ్రేష్ఠమనియు అన్యథా వర్తించుట నీచమనియు దలంచుచున్నాఁడను.

౨౭. సంస్కారములు- దేనిచే శరీరము, మనస్సు, ఆత్మ అనునవి ఉత్తమములగునో దానిని "సంస్కార" మందురు. అది నిషేకాది శ్మశానాన్తము వఱకుఁ బదియాఱు విధములయియున్నది. దీనిఁగర్తవ్యమనిఁ దలఁచుచున్నాఁడను. దహనానంతరము మృతినొందినవాని కొఱకేమియుఁ జేయఁగూడదు.

౨౮. యజ్ఞము :- ఎందు విద్వాంసుల సత్కారము యథాయోగ్య శిల్పము-రసాయనమను పదార్థవిద్య, దాని ఉపయోగము, విద్యాది

శుభగుణముల దానము, అగ్నిహోత్రాదుల వాయు వృష్టి, జల ఓషధు పవిత్రపఱచి, జీవులందఱకు సుఖముగలుగఁజేయుట అనునవి గలుఁగ యదియే యజ్ఞమనబడును. కాన దాని నుత్తమమని దలంచుచున్నాఁడను.

౨౯. ఆర్యదస్యులు:- శ్రేష్ఠపురుషులను "ఆర్య" లనియు ది లను "దస్యు" లనియు నందురు. నేనుకూడ నట్లే నమ్ముచున్నాడను.

౩౦. ఆర్యావర్తము :- ఆది సృష్టినుండి ఆర్యులిందు నివసిం చున్నారు. గాన నీభూమికి "ఆర్యావర్త" దేశమని పేరు. కాని దీని య ఉత్తరమున హిమాలయము వఱకు, దక్షిణమున వింధ్యాచలమువఱకు పశ్చి మున అటకు వఱకు పూర్వమున బ్రహ్మపుత్రానది వఱకు గలదు. ఈనాల్గి మధ్యనున్న భూభాగమునకు ఆర్యావర్త దేశమనిపేరు. ఇంక నిం దెల్లప్పుడుఁ వారినికూడ నార్యులనుట గలదు.

౩౧. ఆచార్యుఁడు:— సాంగోపాంగముగ వేదవిద్యలను జదివించువా సత్యాచారమును గ్రహింపజేయువాఁడు, మిథ్యాచారమును ద్యజింపఁ జే వాఁడునగు నతఁడే ఆచార్యుఁడనఁబడును.

౩౨. శిష్యుఁడు:— సత్యమైన శిక్షను, విద్యను గ్రహింపదగి ధర్మాత్ముఁడు విద్యాగ్రహణమం దిచ్ఛగలవాడు, ఆచార్యునకుఁ బ్రియుఁ వాఁడు నగు నతనిని "శిష్యు" డందురు.

౩౩. గురువులు:- తల్లి, దండ్రియు సత్యమును గ్రహింపఁజేఁ వాఁడును "గురువులు" అసత్యమునుఁ త్యజింపఁ జేయువాఁడు గూడ "గురు వనంబడుచున్నాడు.

౩౪. పురోహితుఁడు:— యజమానునకు హితమొనర్చు వాఁడు, సత్యో పదేష్టయునగు నతఁడే "పురోహితుడు"

౩౫. ఉపాధ్యాయుఁడు:- వేదములందలి యొక భాగమును గాని, అంగ ములనుకాని చదివించువాఁడు "ఉపాధ్యాయుఁడు."

౩౬. "శిష్టాచారము" ధర్మాచరణ పూర్వకముగ బ్రహ్మచర్యమ విద్యను గ్రహించి, ప్రత్యక్షాది ప్రమాణములచే సత్యాసత్యముల నిర్ణయిం కొని, సత్యమును గ్రహించి, అసత్యమును బరిత్యజించుటయే శిష్టాచారః దీని నొనరించువాడు శిష్టుఁడనబడును.

౩౭. ప్రమాణములు:— ప్రత్యక్షాది 'అష్టప్రమాణములను' గూడ నంగీకరించుచున్నాఁడను.

౩౮. "ఆప్తుఁడు" యథార్థము చెప్పువాఁడు, ధర్మాత్ముఁడు. అందఱ సుఖముకొఱకుఁ బ్రయత్నము చేయువాఁడునగు నతనినాప్తుఁడని చెప్పుచున్నాఁడను.

౩౯. పరీక్ష:- అయిదు విధముల నగుచున్నది. (మొదటిది) ఈశ్వరుఁడు, అతని గుణకర్మ స్వభావములు, వేదవిద్య (రెండవది) ప్రత్యక్షాదులగు నెనిమిది ప్రమాణములు, [మూఁడవది] సృష్టిక్రమము, [నాల్గవది] ఆప్తుల వ్యవహారము, (ఐదవది) తన యాత్మ పవిత్రత, మరియువిద్య అను నీ పంచ విధపరీక్షలచేత సత్యాసత్యములఁ నిర్ణయించుకొని సత్యమును గ్రహించి, అసత్యమును బరిత్యజింపఁ దగును.

౪౦. పరోపకారము:- దేనిచే మనుష్యులందఱ దురాచారములు. దుఃఖములు దూరమై శ్రేష్ఠాచారములు, సుఖములు వర్ధిల్లునో యటువంటి కార్యమును జేయుటయే పరోపకారమని భావించుచున్నాఁడను.

౪౧. స్వతంత్రుఁడుపరతంత్రుఁడు:-జీవుఁడు తన కార్యములందు స్వతంత్రుఁడు ఇఁకనీశ్వర వ్యవస్థానుసారము కర్మఫల మనుభవించుటయందు పరతంత్రుఁడు అటులే ఈశ్వరుఁడు తన సత్యాచారాది కర్మములందు స్వతంత్రుఁడని యెఱుఁగదఁగును.

౪౨. స్వర్గము:- సుఖవిశేషభోగమును, తత్సామగ్రి ప్రాప్తిని "స్వర్గ" మని యందురు.

౪౩. నరకము —— దుఃఖవిశేషభోగమును, తత్సామగ్రి ప్రాప్తిని "నరక" మని యందురు.

౪౪. జన్మములు:——శరీరములు ధరించి ప్రకట మగుట 'జన్మము' అది పూర్వ, పర, మధ్య, భేదములఁబట్టి మూఁడువిధములని నమ్ముచున్నాడను.

౪౫. జన్మమరణములు:-శరీర సంయోగమునకు 'జన్మ' మనిపేరు. అట్లే వియోగమే మృత్యువనఁబడుచున్నది.

౪౬. వివాహము:- నియమపూర్వకముగ ప్రసిద్ధముగ స్వేచ్ఛానుసారముగ పాణిగ్రహణము చేయుటయే "వివాహ" మనఁబడును.